వడుగుపాడనియుఁ గొన్నితరములయిన పిమ్మట గుంటూరునకువచ్చి యచ్చట నివాసమేర్పఱచుకొనిరనియుఁ దిక్కన పితామహుని జీవిత కాలమునందో, కాక యాతని తండ్రుల కాలముననో నెల్లూరునకు వచ్చి యట నివాసమేర్పరచుకొనిరనియు జెప్పుచున్నారు. తిక్కన నెల్లూరునివాసి యనుట నిర్వివాద విషయము. తండ్రిని గుంటూరు విభుఁడనుటచేత తండ్రినివాసము గుంటూరనియే చెప్పవొప్పును.

కొన్ని శాసనములలో కోష్ఠాధిపతి యను సంస్కృత శబ్దమునకు తెలుఁగుగ కొట్టారువు అని వ్రాసియున్నారు. ఇట్లే భాండాగారాధిపతులకు భండారువు అని యుపయోగించియున్నారు. తిక్కనవంశీయులలోఁ బూర్వులేమహారాజునొద్దనో కోష్ఠాధిపతులై యుండిరనియు నాకాలపు తెలుగుభాషనుఁబట్టి వారిని కొట్టారువు లని వాడియుండిరనియు దాని ననుసరించి యీవంశీయులకు "కొట్టరువు" అను నింటిపేరు వచ్చియుండుననియు నూహింపఁదగి యున్నది. ఈపే రెప్పుడు వచ్చెనో చెప్పుట కాధారములు లేవు.

కొట్టరువు అననొక గ్రామ ముండెననియు దానినిబట్టి వీరి గృహనామ మేర్పడెననియుఁ గొందఱనుచున్నారు. కాని యది సత్యము కాదు. కొట్టరువుగ్రామ మెచ్చటనుండెనో వారు చెప్పలేదు. గుంటూరు నెల్లూరు మండలములలో కొట్టరువు లేదు.

దశకుమారచరిత్రమందలి తిక్కన ప్రశంస:

తిక్కనసోమయాజి, మూలఘటిక కేతనకవి రచించిన దశకుమార చరిత్రమునుఁ గృతినందెను. అందుఁ దిక్కనగూర్చి యాకేతనకవి రచించిన పద్యముల నీక్రింద నుదాహరించుచున్నాఁడను.

సీ. సుకవీంద్రబృందరక్షకుఁ డెవ్వఁడనిన
వీఁడనునాలుకకుఁ దొడవైనవాఁడు

చిత్తనిత్యస్థితశివుఁ డెవ్వఁడనిన
వీఁ డనశబ్దమున కర్థమైనవాఁడు
దశదిశావిశ్రాంతయశుఁ డెవ్వఁడనిన
వీఁ డని చెప్పఁగఁ బ్రాతిమైనవాఁడు
సకలవిద్యాకళాచణుఁ డెవ్వఁ డనిన
వీఁ డనిచూపఁగ గుఱియైనవాఁడు
మనుమసిద్ధిమహీశ సమస్తరాజ్య
భారధౌరేయుఁ డభిరామభావభవుఁడు
కొట్టరువు కొమ్మనామాత్యు కూర్మిసుతుఁడు
దీనజనతావిధానంబు తిక్కశౌరి.

క. అగు నన గొమ్మనతిక్కఁడు
జగతి నపూర్వార్థశబ్దసాంగకవితమై
నెగడిన బాణోచ్ఛిష్టం
జగత్త్రియం బనినపలుకు సఫలం బయ్యెన్.

క. కృతులు రచియింప సుకవుల
కృతులొప్పఁ గొనంగ నొరునికిం దీరునె వా
క్పతినిభుఁడు వితరణశ్రీ
యుతుఁ డన్నమసుతుండు తిక్కఁ డొకనికెఁ దక్కెన్.

సీ. సరసకవీంద్రుల సత్ప్రబంధము లొప్పఁ
గొను ననుటధికకీర్తనకుఁ దెరవు
లలిత నానాకావ్యములు చెప్ప నుభయభా
షలయందు ననుట ప్రశంసత్రోవ
యర్థిమైఁ బెక్కుశిల్ప సగ్రహారంబులఁ
గా నిచ్చు ననుట పొగడ్తపాలము

మహితశక్తిం బైన బహువిషయాగంబు
లొనరించు ననుట పన్నము దారి
పరుని కొక్కరి కిచ్చియుఁ బ్రాఁటవృత్తి
నిజము లై పెంపు సొంపార నెగడునట్టి
కొమ్మనామాత్యు తిక్కన కొలఁది సచివు
లింక నొక్కరుఁ డెన్నంగ నెందుఁ గలఁడు?

ఇతఁడు కేవల మంత్రియే గాక దండాధీశుఁడు కూడ నైనట్లు కేతన రచించిన యీక్రింది పద్యముల వలన స్పష్టమగుచున్నది.

క. శ్రీకరపరవచన దూ
రీకరణానోఢశుభచరిత్రుని ననుకం
పాకరహృదయుఁ గులాబ్ధిసు
ధాకరు శుభమూర్తిఁ దిక్కదండాధీశున్.

క. శ్రీవిలసద్గుణమణీయా
భావితభవపాదపద్మ భావనిధానా
భూవినుత శుభచరిత్రా
ధీవిభవాత్తస్వరూప! తిక్కచమూపా!

కేతనకవి రచించిన యీపద్యములవలం దతిశయోక్తి గాని యుత్ప్రేక్ష గాని లేదని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. ఆధ్యాత్మికజ్ఞాన సంపన్నుఁడగు నీమహామహుఁడు తనవంశమున రాబోవువారల కైశ్వర్యమును సంపాదించి నిలుపయుంచవలయు నను కోరికకలవాఁడు కాఁడనుట కితని కుమారుఁడొక చిన్నగ్రామమునకుఁ గరణమై యుండుటయే నిదర్శనము. ఇతఁడు తన శక్తినంతయును ప్రభుకార్యనిర్వహణము నందు వినియోగించి చోడరాజ్యస్థాపనాచార్యుఁ డయ్యెను. తన పాండిత్యమును లోకశ్రేయమునకును, ఆంధ్రసాహిత్యాభివృద్ధికి నుప

యోగపఱచి, యుద్ధఘటనమును గావించుటయేగాక యనేకపు లకుఁ బండితులకుఁ బ్రోత్సాహ మొసంగియున్నవాఁడు మారనవంటి మహాకవి యీతనికి శిష్యుఁడగుటయు కేతనవంటి పండితకవి కృతిదాత గావుటయు, బయ్యనవంటివాఁ డీతనిచే బిరుదమును గ్రహించుటయు నితనికిఁ దార్కాణములు.

హరిహరనాథుని ప్రశంస:

ఇతఁడు పరమ భక్తాగ్రేసరుఁడనుట కీతని రచనములే దృష్టాంతములు. ఇతని కాలమున వీరశైవవైష్ణవమతములు పరస్పర ద్వేషముతో నుండి యన్యోన్యహింసకూడఁ గావించుకొను స్వభావముతో మెలఁగుచు వచ్చినవి. అట్టిసమయమున నీమహానుభావుఁడు శివకేశవుల యభేదమును ప్రతిపాదించి, హరిహరనాథుఁడను దైవమునకు తనభారతమునుఁ గృతియిచ్చెను. నెల్లూరునందు హరిహరనాథ దేవాలయము ముండెడిదనియు, తిక్కనసోమయాజి భారతము నాయాలయమునఁ బవిత్రహృదయముతోఁ గూర్చుండి రచియించెననియు జెప్పుదురు. భారత విరాటపర్వ కృత్యాది యందలి "అతిపూని యాంధ్రకావ్యంబులగు పుణ్యప్రబంధంబులు దేవసన్నిధిం బ్రశంసించుటయు లోకయారాధన విశేషం బగుటఁ జేసి" అనువాక్యము లీ యంశమును ధ్రువపఱచుచున్నవి. ఈకృతిరచన మొకవిధమగు దేవతారాధన మని తిక్కన మనసార విశ్వసించెను. ఈతని తరువాతికవులు కొందఱీతని ననుకరించి తమ గ్రంథములను హరిహరనాథునకు కృతియొసంగిరి. నెల్లూరునం దిప్పు డీయాలయము లేదు. పాండవుల యాలయ మొకటి కలదు. ఇప్పుడు రంగనాథస్వామి యాలయమున్నచోటనే పూర్వము హరిహరనాథుని యాలయ ముండెడిదనియు నది శిథిలమైపోఁగా నాప్రదేశమున రంగనాథాలయమును నిర్మించిరనియు జెప్పుదురు. నెల్లూరుకడ పెన్న రెండు పాయలైనదనియు, రెండవపాయ నెల్లూరునకు దక్షిణమున నుండెడి

దనియు. నదియొడ్డున పూడిపోయినదనియు, నాపాయకు దక్షిణపు టొడ్డున హరిహరనాథ దేవాలయ ముండెడిదనియు దాని శిథిల చిహ్నము లిప్పుడును గన్పడుచున్నవనియు కొందఱనియెదరు. బైచరాజు వెంకటనాథకవి తన పంచతంత్రము నీ హరిహరనాథునకుఁ గృతి యిచ్చియుండుటచే నాతని కాలము వఱకును (పదునైదవశతాబ్ది) నాలయ ముండెనని విశ్వసింపవచ్చును. సప్తగోదావరీ సంగమమున నొక హరిహరదేవాలయ ముండెడిదని ద్రాక్షారామమునందలి యొక శాసనము (పదుకొండవశతాబ్దినాఁటిది. ద. హిం. శా. సం. ౪ సంఖ్య ౧౦౪౯) వలనఁ దెలియుచున్నది. హరిహరనామక పట్టణమొండు కర్ణాట దేశమునఁ గలదు.

హరిహరనాథునిఁ బ్రశ్నించుచు తిక్కనరచించిన యీక్రింది శ్లోకమాదేవునకుఁ బరమప్రీతిఁ గల్గించెనఁట!

"కిమస్థిమాలాం కిముకౌస్తుభం వా
పరిష్క్రియాయాం బహుమన్యసే త్వమ్
కిం కాలకూటః కిమువా యశోదా
స్తన్యం తవ స్వాదు వద ప్రభో మే"

"ప్రభో! నీవు అలంకరించుకొనుటకో అస్థిమాల నిచ్ఛయింతువా లేక కౌస్తుభము నభిలషింతువా? నీకు కాలకూటము రుచ్యముగానుండునా? లేక యశోదాస్తన్యము రుచ్యముగానుండునా నాకుఁ జెప్పుము" ఇది పైశ్లోకార్థము.

భగవంతుడు స్వప్నమునఁ బ్రత్యక్షమై శివకేశవుల కభేదమునుఁ బ్రతిపాదించుచు గ్రంథమును రచింపుమనుటఁ దనను గొనియాడుచున్నట్లీక్రింది పద్యములోఁ గవి చెప్పియున్నాఁడు.

ఉ. వైదికమార్గనిష్ఠ మగు వర్తనముం దగ నిగ్రహించుచు
న్ఖేదము లేనిభక్తి మతి నిర్మలవృత్తిగఁ జేయుచుండ నా

త్పాదవిరంచనసరణత్పుణ్యాపము కల్మి నాస్మ స
మ్మోదముఁ బొందఁ గావ్యరసముం గొనియాడఁ జుమండు నెప్పుడున్.

స్వప్నసాక్షాత్కార కథఁ జెప్పిన వారిలో మొదటివాఁడు తిక్కనసోమయాజి. తరువాతివారు పెక్కురీతుల ననుకరించి తమ గ్రంథములలోఁ దమపూర్వులో, తమ యారాధించెడి దేవతలో స్వప్నమునఁ బ్రత్యక్షమైనట్లు వ్రాసికొనుచు వచ్చిరి. కొందఱీవిషయ మొక యాచారముగాఁ బరిగణించి యట్లు చెప్పికొనియుందురని తలంచినను దిక్కనసోమయాజివంటి భక్తాగ్రగణ్యున కీశ్వరసాక్షాత్కారము నొసఁగెనని యూహించుటయే సమంజసము. పరమహంస రామకృష్ణునకుఁ గాళికాదేవి ప్రత్యక్షమగుచుండెడిదని చెప్పుటయు నది సత్యమని విశ్వసించుటయు నిరువదియవ శతాబ్ది యందలి సంగతులు. మానవునకుఁ బరమేశ్వరసాక్షాత్కారము సంభవమని యీకాలమునఁ గొందఱి విశ్వాసము. కాని యది యీ ప్రస్తుత విషయము కాఁజాలదు.

హరిహరనాథుఁడు తిక్కన హృదయమున నిర్మించుకొనిన దేవుఁడే కాని యన్యస్వరూపుఁడు కాఁడని కొందరిమతము. అది సత్యము కాదు. హరిహరనాథాలయములు పూర్వకాలమున నచ్చటచ్చట నుండెడివనుటకు శాసనప్రమాణములు కలవు. ఆయాలయము నందలి యేకవిగ్రహమున హరిహరరూపములు రెండునుఁ గనుపడునట్లు చెక్కఁబడియుండెడివని చెప్పుదురు. తూర్పుగోదావరిమండలమున రాజోలుతాలూకాలో కేశవస్వామి యాలయమున నెదుటిప్రక్క కేశవరూపమును వెనుకప్రక్క స్త్రీరూపమును [illegible]చియున్నవి. శ్రీమహావిష్ణువు మోహినీరూపమున శివుని వంచించినకథను సూచించుటకై యీవిగ్రహమును నిర్మించిరని యచ్చటివారు చెప్పుచుందురు. కావున హరిహరనాథుఁడు కేవలమానసికారాధనకొఱకుఁ గల్పించు

కొనినవాఁడే కాక యర్వాచ్యస్వరూపుఁడుగాఁగూడ నున్నాఁడని విశ్వసింపవచ్చును

తిక్కనసోమయాజి నిర్వచనోత్తరరామాయణమును రచియించు నాఁటికి బూర్వమే తలిదండ్రులిరువురును స్వర్గము నలంకరించియుండి రని చెప్పుదురు. దీనినిబట్టి యీతఁడు బాల్యమునందే మాతాపితృవిహీను డయ్యెననియుఁ బెదతండ్రిచేఁ బెంపఁబడి విద్యల నభ్యసించి సర్వకళల బరిపూర్ణుఁడయ్యెననియు నెంచఁదగియున్నది.

## తిక్కన యజ్ఞకథ:

తిక్కనామాత్యుఁడు రాజకార్యములలో నిమగ్నుఁడై యున్నను బ్రాహ్మణోచితములగు వైదికకర్మల నుపేక్షింపలేదు. నిర్వచనోత్తర రామాయణగద్యయందు "బుధారాధనవిధేయ తిక్కనామాత్యధేయ" యనియు, భారతగద్యయందు "బుధారాధనవిరాజితిక్కనసోమయాజి" యనియుఁ దెలుపుకొనియుండుటచే నీతఁడు నిర్వచనోత్తరరామాయణ రచనమునకుఁ దరువాతను, భారతరచనకుఁ బూర్వమునను జన్నము చేసెననుట స్పష్టము. కేతనకవి దశకుమారచరిత్రమునఁ దిక్కనను వర్ణించుచు "మహితదక్షిణలైన వివిధయాగంబు లొనరించు ననుట వర్ణనము దాని" యని చెప్పుటచే దశకుమారచరిత్రముఁ గృతినొందుటకుఁ బూర్వమే యీతఁడు యజ్ఞమును జేసియుండునని కొందఱను చున్నారు. అదిసత్యమైనచోఁ గేతనకవి యెచ్చటనైనను తిక్కన నామాంతమున నాతఁడు యజ్ఞకర్త యని సూచించుపదమును వేయకుండ నుండఁడు. అట్టి పద మేదియు దశకుమారచరిత్రమున లేదు. కావున నాయూహయందు సత్యము లేదని తేటపడుచున్నది. కేతన చెప్పినదానికి వైశ్వదేవాదియాగములని యర్థము చెప్పవలసియుండును. మనుమసిద్ధి చనిపోయినపిదప భారతరచనారంభమునకుఁ బూర్వమీతఁడు జన్న మొనర్చియుండునని నాయభిప్రాయము

నన్నయభట్టు రచింపగా మిగిలినభాగమును పూర్తిచేయించుటకై తగినకవికొఱకు రాజరాజనరేంద్రుఁడు ప్రయత్నముచేయుచు, నన్నయ రచనమునందలి తుదిపద్యమగు:

ఉ. శారదరాత్రు లుజ్జ్వలలసత్తరతారకహారపంక్తులం
జారుతరంబు లయ్యె వికసన్నవకైరవగంధబంధురో
దారసమీరసౌరభముఁ దాల్చి సుధాంశువికీర్యమాణ క
ర్పూరపరాగపాండురుచిపూరములం బరిపూరితంబులై"

యనపద్యము నొకతాళపత్రముపై వ్రాయించి యిట్లు వ్రాయఁగలిగిన కవు లెవరైననున్నచో నీభావమును దమశైలిలో రచించి పంపుఁడని రాజాస్థానములకుఁ బంపెననియు, నది మనుమసిద్ధికడకు రాఁగా, దిక్కనసోమయాజి యాపద్యమునే తాళపత్రముపై వ్రాసియిచ్చెననియు, నన్నయతో సమానముగా దాను వ్రాయఁగలనను తిక్కనభావమును గ్రహించి రాజరాజు నాతని తనకడకుఁ బంపుమని మనుమసిద్ధిఁ గోరనయుఁ దిక్కన యందులకు అంగీకరింపకపోఁగా మనుమసిద్ధికి గోపము వచ్చి "పలువురిలో నీబుఱ్ఱగొఱిగించివీధులవెంటఁ ద్రిప్పి మాంసమును దినిపించెద" నని తూలనాడెననియుఁ దరువాత రాజు పశ్చాత్తప్తుఁడై తనమాట నిలుపుకొనుటకై తిక్కనామాత్యునిచే యజ్ఞము చేయించెననియు నొకకథ చెప్పెదరు. కాని యిందులేశమాత్రమును సత్యము లేదు. (యజ్ఞము చేయువానికి క్షౌరమును, నూరేగుటయు, సోమపానమును గర్తవ్యములు)

మనుమసిద్ధి మహారాజు రాజరాజునకుఁ దరువాత రెండువందల సంవత్సరములలో నున్నవాఁడు. భారతమును బూర్తిచేయించుటకై రాజరాజు ప్రయత్నించెననుటకుఁ గూడ నాధారములు లేవు. భారతమును దనకుఁ గృతియిమ్మని మనుమసిద్ధి యడిగెననియుఁ దిక్కన యందులకంగీకరింపకపోఁగాఁ బైనిజెప్పినకథ నడచెననియుఁ గొందఱందురు.

కాని యెందును సత్యము లేదు. తిక్కనభారతమును రచించునాటికి, మనుమసిద్ధి జీవించియుండెనో లేదో యని సంశయముగా నున్నది. భారతమును భగవంతునకుఁ గృతి యీయఁదలఁచినప్పు డందుల కభ్యంతరమును గలుగఁజేయు స్వభావముకలవాఁడు కాఁడు మనుమసిద్ధి. తిక్కనయెడల మనుమసిద్ధికి గౌరవము మెండు. శ్రీకృష్ణదేవరాయలు తనమంత్రియైన తిమ్మరుసును "అప్పాజీ" యని పిలచినట్లే మనుమసిద్ధి తిక్కనను 'మామా' యని పిలుచుచుండెడివాఁడు. మనుమసిద్ధి తిక్కనలకుఁగల యన్యోన్యగౌరవము నిర్వచనోత్తర రామాయణము నందలి యీక్రింది పద్యములవలనఁ దెలియుచున్నది.

చ. హరిహరపద్మగర్భులను నాదికవీంద్రుల నూహ్నసత్కవీ
శ్వరులను భక్తిఁగొల్చి తగ వారికృపం గవితావిలాస వి
స్తర మహనీయుఁడైన నను సర్వగుణోత్తమమూర్తి మన్మభూ
వరుఁడు దగంగ రాఁబిలిచి వారము మన్నన నాదరించుచున్.

క. ఏ నిన్ను మామయని యెడు
దీనికిఁ దగ నిమ్ము భారతీకన్యక నా
కీవఁగావడ వగు దనినను
భూనాయకుపల్కు చిత్తమున కింపగుడున్.

సీ. సకలలోక ప్రదీపకుఁ డగు పద్మినీ
మిత్రుని వంశమున జనించెననియుఁ
జూచిన మగలైనఁ జొక్కెడుశట్టి సౌం
దర్య సంపద సొంపుఁ దాల్చెననియు
జనహృదయానందజనకమై నెగడిన
చతురత కల్మి సప్రతముఁడనియు
మెఱసి యెందొంటికి మిగుల శౌర్యత్యాగ
విఖ్యాతకీర్తుల వెలసెననియు

వివిధవిద్యాపరిశ్రమవేది యనియు
సరసబహుమాన విరచనాశాలి యనియు
మత్కృతీశ్వరుఁ డగుచున్న మనుమనృపతి
సుభగుఁ గావించుఁ దను సముత్సుకుఁడ నైతి.

మనుమసిద్ధి మహారాజు తిక్కనకు రాజచిహ్నముల నిచ్చి గౌరవించిన ట్లీక్రిందిపద్యమునఁ గేతనకవి చెప్పియున్నాఁడు.

గీ. అందలంబు గొడుగు లడపంబు మేల్కట్టు
చామరములు జమిలిశంఖములును
గంబకట్లు భూమి గానిక గాఁగఁ బెం
పెసఁగు రాచపదవులెల్లబడసె.

పైపద్యమునందు మనుమసిద్ధి వివిధవిద్యాపరిశ్రమ వేదియనియు, సరసబహుమాన విరచనాశాలి యనియు జెప్పియున్నాఁడు అట్టి వాఁడు తిక్కనను బహిష్కరించెనని నమ్ముటకు వీలులేదు కావునఁ బైకథ యొంతమాత్రమును విశ్వసనీయము కాదు. కృతిపతిఁ గన్యకతోఁ బోల్చిన వారిలోఁ దిక్కనయే మొదటివాఁడు. రాజరాజు పరిష్క రింపిన పద్యము పైని జెప్పినది కాదనియు "సింధురానంబు" అనుపద్యమనియు గొందఱందురు. మఱియొకటియని యింకఁ గొందఱందురు.

తిక్కనతరువాత నాతనివంశము :

తిక్కనసోమయాజికిఁ దరువాత నాతనికుమారుఁడు నెల్లూరునకు పడమట రెండుమూఁడు కోసుల దూరములో పినాకినీనదీతీరమందున్న పాటూరు గ్రామ కరణీకమును సంపాదించి యక్కడ నివాసమేర్పరచుకొనిరనియు నప్పటినుండియు వారు పాటూరివారని పిలువఁబడుచుండిరనియుఁ జెప్పుచున్నారు ఈవంశావళిని వర్ణించు రెండు సీసపద్యములను బ్ర. శ్రీ. వీరేశలింగముపంతులుగారు ఆంధ్రకవుల చరిత్రమున నుదాహరించియున్నారు. ఆ పద్యములివి :

సీ. భారతపర్వము ల్పదియేను వరుసగాఁ
దెలుఁగించె గుంటూరితిక్కయజ్వ
యామహాత్మునకు పుత్రుఁడౌ కొమ్మనఘనుండు
కల్పించెఁ బాటూరి కరణికంబు
వాకొమ్మనకుఁ గల్గె హరిహరామాత్యుండు
నెమ్మితో నతనికిఁ గొమ్మఘనుఁడు
ఁహిమాఱ నతనికి రామన తిప్పన
యారామనకు సోమయాజ్వయుండు
ఆఘనునకు వీరనామాత్యుఁడతనికి
సోమలింగమంత్రి యామహాత్ము
నకును సోమరాజనామ్యుఁడు జిట్టివీర
ఘనుఁడనంగ సుతులు గలిగి రందు

సీ. సోమమంత్రికిఁ గల్గె సుతుఁడు పాపనమంత్రి
యతనికి వీరన యాఘనునకుఁ
గూరిమి తనయులు గోపాలభద్రాఖ్య
నరసింహమంత్రు లనంగ ముగుడు
వారిలో నరసింహవరునకు శరభార్యుఁ
డును భాస్కరామాత్యుఁడు నరసింహ
ఘనుఁడనఁ బుత్రులు గలిగిరి మువ్వురు
వారిలో శరభార్యవర్యునకును
వీరఘనుఁడు గలిగె వేఙ్కనామంత్రికి
శరభమంత్రివరుఁడు జనన మొంది
ప్రబలియున్నవాఁడు పాటూరిలోఁ దన
కులము వర్థిలంగఁ గొమరు మీఱి.

ఇందులో మొదటిపద్యము పూర్వరచిత మనియు, రెండవ పద్యము శరభరాజు గారిచ్చిన వంశానుక్రమణికనుబట్టి బ్రహ్మశ్రీ శత ఘంటము వెంకటరంగనాథశాస్త్రిగారు రచియించి రనియుఁ జెప్పుచు న్నీపద్యములను శరభరాజుగారు వీరేశలింగముపంతులుగారి కిచ్చిరఁట. పాటూరి కరణికమునబట్టి వీరు పాటూరి వారైరఁట.

కొందఱు శివంశావళిని గూర్చి సంశయమును దెలుపుచున్నారు. తిక్కనసోమయాజి యుపయోగించిన గంటపుబిర చాలకాలము వీరి యింట నుండెననియు నందుపై నొకప్రక్క సరస్వతి విగ్రహమును నొకప్రక్క విఘ్నేశ్వర విగ్రహమును జెక్కఁబడియున్నవనియు బ్రతీతి కలదు. అది యిప్పుడున్నదో లేదో తెలియదు. బ్ర. శ్రీ వీరేశలింగ ముపంతులుగారీ వంశావళినిబట్టి తిక్కన కాలమును నిర్ణయింపయత్నించిరి. ఇప్పుడు శాసనసాహాయ్యమున నీమహాకవి కాలము స్పష్టముగాఁ దెలి యుచున్నది. కావున నంకుల కీవంశావళితోఁ బనిలేదు. మడికిసింగ నకుఁ బితామహుఁడైన యల్లాడమంత్రి తిక్కనసోమయాజి పౌత్రిని బరిణయమాడెనని సింగకవికృత వాసిష్ఠరామాయణములోఁ జెప్పఁబడి యున్నది.

### ఆంధ్రభాష కీతఁడొనర్చిన సేవ :

ఆంధ్రభాషాభివృద్ధికై పాటుపడినవారిలోఁ దిక్కన యాగ్రేసరుఁ డు. నన్నయాదు లాంధ్రభాషలోఁ గావ్యములను రచించినను, వారి కావ్యములలో సంస్కృతపదము లధికమును, ఆంధ్రపదములు స్వల్పము గను నున్నవి నన్నెచోడుడు, సోమనాథుఁడు మొదలగు శివకవులు తమ గ్రంథములలో దేశీయపదముల నధికముగనుపయోగించి యాంధ్ర సాహిత్యాభివృద్ధికై యెక్కువగా పాటుపడియుండిరి. తిక్కనసోమ యాజి రెండుగ్రంథములను రచియించుటే కాక, యాకావ్యములలో

దేశీయపదములను జక్కగా సంస్కరించి యుపయోగించి, తన రచనముల నాంధ్రసాహిత్య గ్రంథములుగాఁ జేసెను. ఆంధ్రాభ్యుదయ రచయితలలోఁ దిక్కన యగ్రగణ్యుఁడని చెప్పనొప్పును. ఆంధ్రసాహిత్య పోషణమున కీతఁడు పడినశ్రమ యపారము. ఈతనిరచనములు రెండును సంస్కృతమున కాంధ్రీకరణములైనను, ఇతఁడు గొప్పసంస్కృతపండితుఁడైనను, నీతని కవిత్వమునందుఁ "నన్నుపయోగింపుఁడు నన్నుకొనుఁ"డని సంస్కృతపదములు ముందునకువచ్చి యుఱ్ఱూతలూగించుచున్నను, నాంధ్రభాషాభివృద్ధియే మనమున నిడుకొని విశేషముగా జాతీయపదములనే యుపయోగించి, రసముప్పతిల్లునట్లు కావ్యరచన సాగించినవాఁడీమహాకవి. ఈతని కవిత్వమునందు సంస్కృతపదములున్నను నవి యతిమృదులములై సామాన్యులు వాడుకొనుచుండునట్టివియుఁ "ఇవి సంస్కృతపదములా? జాతీయములా?" యని సంశయము గల్గించునట్టివియునై యున్నవి. ఈతఁడు తన రచనావిధానమునుసూచించుచు నిర్వచనోత్తర రామాయణమున:

ఉ. జాత్యముగాని నొప్పయినసంస్కృతమెయ్యెడఁజొప్పడ వాక్యసాం
గత్యము సేయుచో నయిన గద్దముతోడఁగఁ జెప్పనట్టి దౌ
ర్గత్యము దోఁపఁ బ్రాసము పరిహారము వేఱుగునక్షరంబులన్
ప్రత్యనురూప మెంచునది; సూరుల కివ్విధ మింపుఁ బెంపదే.

అనుపద్యమును జెప్పి యారీతిగనే తన కావ్యములను విరచించినాఁడు. ఈసందర్భమునఁ దిక్కన కవిత్వపుసొంపు సూపుటకై కొన్నిపద్యముల నిట నుదాహరించుట యావశ్యకము కాకపోదు.

ఉ. నన్నుఁ బరాభవించి సదనంబునకుం జని కీచకుండు ము
న్నున్నతెఱంగు దప్పక సుఖోచితశయ్యను నిద్రసేయ నీ
కన్ను మొగుడ్చి యూఱకుంటకుఁ గారణమెయ్యది భీమసేన! మీ
యన్న పరాక్రమంబు వలదన్ననొకో దయమాలి తక్కటా! (విరా)

క. ఆపదఁ గడవంబెట్టఁగ
నోపి శుభంబైనదాని నొడఁగూర్పుముమా
కీపుట్టువునకుఁ బాండు
తన్మహీపాలుఁడు నిన్నుఁజూపి చనియె మహాత్మా!

ఆ. కౌతుకంబుగాంచు రాచకూఁతు రెవ్వాని
నట్టివానికి నుచిత మైనసమయ
మొసఁగెఁ దడయ యింకనొప్పదు జనములు ఉ. ప.
నల్లుఁగాని పురుషుఁ డనరు మిమ్ము

తే. వట్టపగలింటిసూర్యునివగిదిఁ గర్ణుఁ
డుగ్రమూర్తియై వెలుఁగుచున్నవాఁడు
మాధవా! మా రథంబును మరలనిమ్ము
బ్రతికియుండిన శుభములు బడయవచ్చు. క. ప.

చ. వెగవును లావుఁ జేవయును వీరల కారయ నొక్కరూపదు
ర్వ్యాభుజశక్తి ధర్మజుఁడు శల్యుని రూపడఁగించి యివ్వసుం
ధరఁ గొనునొక్కొ నేఁడితనిఁ దా సమయించి సమస్తమేదినీ
శ్వరుఁడుగఁ జేయనోపునొకొ శల్యుఁడు కౌరవరాజనందనున్ (శ. ప)

ఉ. క్రూరుఁడు లోభియున్ శఠుఁడు గొండియుఁడున్ జడుఁడుం గృతఘ్నుఁ [డున్
నేరనివాఁడు బొంకరియు నిందకు నోర్చువతండుఁ బంచయున్
ధీరతలేమి దుర్గుణము మతివ్యసనత్వముఁ గల్గువారలుం
జేరువ నుండ భూపతికిఁ జెట్ట యొనర్చు నరేశ్వరోత్తమా! (శాం. ప)

సీ. దివియలోఁ బడుఁబుర్వు దివియగా త్రిపవానిఁ
బాపంబు వొందునే! యోపి దున్న
వాఁగేటి మొనఁ జచ్చు నానావిధప్రాణు
లన్నరుబొందునే యఘము? వాడు

దమపను త్సేయు విధాతృవశమున నా
　　యావు దెగినట్టిజంతువులు వచ్చు
నేమి సంపితిమని యెంచు కేనియు నహం
　　కారంబు వారికిఁ గలుగ దట్టు
ఆ గాన చూవె వారిఁ గల్మష మొందదు
　పుణ్యపాపములకు బుద్ధిమూల
　మశిశుపుండు మాలి యు ననహింసవోలె నై
　యాధిధర్మ మైనకథము వినుము.　　ఆ. వ.

ఉ ఏను హితంబుసెప్ప విలె లేవి దురాచరణంబు లిమ్మెయిన్
　మానవు రోగి చేఁదయినమందు దయుఁ దేపు లంటఁదా కినం
　గాని రొటుగఁ దప్పు పతికారము గల్గునె యట్టిపోలె ని
　వైన నికృష్టవృత్తిఫల మంది తలంచెదు గాక పిమ్మటన్.　　ని. రా.

స్థాలీపులాకన్యాయముగ నీపద్యములఁ జూపితిని. గ్రంథమంతయు నిట్లే యుండును. ఈతనిని జూచి కేతన మారనాదు లిట్లే తమ గ్రంథముల యందు జాతీయపదముల నుంచి రచించుచువచ్చిరి. కాని శ్రీనాథాది మహాకవులు కొందఱీమార్గమును విడనాడి తమ కావ్యములను సంస్కృత పదజాలములతో నింపివైచిరి. సాంస్కృతిక దీర్ఘసమాసములతో గ్రంథములను రచించుటయే గొప్పతనమని తలంచినకవులు కూడఁ గొందఱు కలరు. ఆంధ్రభాషలోఁ గావ్యరచనము జేయఁదలచికొనినప్పుడు దేశీయపదములతోఁ బాఠకలోకమునకును వినువారికిని హృదయాహ్లాదమును గలుగఁజేయునట్లు రచియించుటయే గొప్పతనమగును గాని నిఘంటుసాహాయ్య ముండినఁగాని యర్థముకాని గూఢసంస్కృత పద సమాసములతో నాంధ్రకావ్యమును రచించుట గొప్పతనము కాఁజాలదు. ఈసందర్భమున మొల్ల తన రామాయణమునఁ జెప్పిన

క. మును సంస్కృతంబు తేటగఁ
దెనిఁగించెడిచోట నేమి తెలియకయుండన్
దనవిద్య మెఱయఁ గ్రమ్మఱ
ఘన మగు సంస్కృతము చెప్పఁగా రుచియగునే.

ఆ. తేనె సోఁక నోరు తియ్యన యగురీతిఁ
దోన యర్థ మెల్ల దోఁపకున్న
గూఢశబ్దచితతఁ గొల్లాటపని యెల్ల
మూఁగ చెవుడు నాడు ముచ్చటగును

క. కందువమాటలు సామెత
లందముగాఁ గూర్చి చెప్పినది తెనుఁగునకున్
బొందై రుచిదై వీనుల
విందై మతి కాసపించు విబుధుల కెల్లన్.

అను పద్యములు స్ఫురణకు వచ్చుచున్నవి. తిక్కనసోమయాజి తన గ్రంథములయం దుపయోగించిన దేశీయపదములు వేలకొలఁదిగనున్నవి. సంస్కృతపదముల విషయమున "బాణోచ్ఛిష్టం జగత్రయ" మ్మనెడు మాట దేశీయపదవిషయమున నీసోమకవికి వర్తించు ననుటకు సంశయము లేదు. ఈభావమును దశకుమారచరిత్రకృతికర్తయగు కేతనకవి "అగుననఁ గొమ్మనఁ దిక్కఁడు" (ఈపద్యమును పైనుదాహరించితిని.) అనుపద్యములో వ్యక్తీకరించియున్నాఁడు.

ఇతని కవిత్వగుణము :

అద్వితీయప్రతిభావంతుఁడగు నీమహామహుని కవిత్వగుణమును జూపనెంచుట సూర్యుని కాగడాలోఁ జూపనెంచుట వంటిది. ఆంధ్రకవులలో నీతనితో సమానులింకొకరు లేరు. ఈతనికవిత్వ మింతగా సర్వజనాకర్షణీయ మగుటకుఁ గారణములు కొన్ని గలవు. అందు

మొదటిది:- ఈతఁడు చేపట్టిన కావ్యములయందలి యితివృత్తములు, ఆర్ష్యలవగు మనకుఁగల యితిహాసములలో శ్రేష్ఠములయినవి రెండు. భారతము, రామాయణము. ఈ కావ్యములు రెండింటి నీతఁడు చేపట్టినాఁడు. "మణినావలయమ్ వలయేన మణి" యనునట్లు కవిత వలన కథయునుఁ గథచేఁ గవితయు శోభ కెక్కును. వ్యాస వాల్మీకుల ప్రతిభ జగద్విదితమగుటచేఁ గాఁబట్టి యీ కావ్యముల యందలి యితివృత్తములే తన కవితాశక్తిని ప్రదర్శించుటకుఁ దగిన కథ లీతనికి లభించుట గొప్ప యదృష్టము.

రెండవది:- ప్రసన్నత్వము ఈతని కవితయందు పెద్దపెద్ద సంస్కృత సమాసము లుండవు. చిన్నచిన్న దేశ్యపదముల నే విశేషముగా నీతఁ డుపయోగించును. ఏతావున నేపదముపయోగించిన రస ముప్పతిల్లునో యాతఁ డెఱిఁగినటు బాగుగాఁ దెలియును. ఎచ్చట నైనం సంస్కృతసమాసము లున్నను, అవి మృదుపద సంయుతములై మనోహరముగా నుండును. వాని యర్థమును గ్రహించుటకై నిఘంటు కతాంకముల యక్కర యుండదు.

మూఁడవది:- అర్థగాంభీర్యము. ఎంతచిన్నపదముల నుపయోగించినను వానిదెంతయో గాంభీర్యముగు నర్థ మిమిడియుండును. పాఠకుని శక్తికొలఁది వానిలోని భావగాంభీర్యము విదితమగుచుండును.

నాల్గవది:- వ్యర్థపదరాహిత్యము. ఇతని కవిత్వమునందుఁ బాదపూరణమునకును యతిప్రాసల కొఱకును దెచ్చిపెట్టుకొనెడి పదము లుండవు. ఎచ్చటనైన స్వల్పముగా నట్టి పదము లున్నను నవి కేవలము పడికట్టురాళ్లుగా నుండక యవియుఁ గూడ నెంతయో కొంత తూకమును దెలుపునవిగానే యుండును.

ఐదవది:- పాత్రౌచిత్యము. కవిత్వ మెంత రసవంతముగ నున్నను, పాత్ర పోషణము యుక్తముగ లేకున్నచో సహృదయుల కానందము కలు

గదు. భారతమున ప్రధానపాత్రములు రెండు ధర్మరాజును, ద్రౌపదియు. తిక్కన నీయిరువురను భారతమునం దుదికంటఁ జక్కగా పోషించినాఁడు. ఈ విషయమున వ్యాసునికంటె నీతనిదే పై చెయ్యియైనది. ధర్మరాజు రాజనీతిజ్ఞత, సమయోచితజ్ఞానము కార్యదీక్ష, ఇంద్రియనిగ్రహము, సత్యాగ్రహము, ఓర్పు మొదలగు గుణముల జూపుచు, తిక్కన వ్రాసిన భాగముల నొక్కచోఁ జేర్చి చూపినచో, లోకమున కెంతయో మేలు కలుగునని నాయభిప్రాయము. భారతమందలి యితరపాత్రములనుగూడ నీతఁడు చక్కగా పరివర్ణించినాఁడు.

ఆఱవది:— భావప్రకటనము. తాను చెప్పఁదలచుకొనిన భావము పాఠకులకు స్పష్టముగాఁ దెలియునట్లు చిన్నచిన్న మాటలతో వ్రాయు నేర్పు కవిశేఖరున కలవడినట్లింకొకరి కలవడలేదు. ఇరువురువ్యక్తులు మాటలాడునప్పుడది పద్యరూపమున నున్నను దృశ్యప్రబంధములో వలె నెదురుగా గూర్చుండి మాటలాడుకొనుచున్నట్లేయుండి పాఠకున కెంతయో యానందము కలిగించుచుండును. పౌరాణికునకట్టిసందర్భములో నాభావమును దనమాటలతో శ్రోతకు విప్పి చెప్పుట కవకాశము గలుగుచుండును. ఎంతటి కఠినవిషయము నైనను చిన్నమాటలతో సులభముగా బోధపడునట్లు చెప్పుటలో నీతఁడు మిగుల నిపుణుఁడు.

ఏడవది:— రసపోషణము. సందర్భము ననుసరించి నవరసములును పాఠకుఁ డనుభవించునట్లు తగిన యితివృత్తమును గల్పించుట యందును, ఆరస ముప్పతిల్లుపదముల నుపయోగించుట యందును రసపోషణమునందును నీతనికిఁ గల శక్తి యపారము.

ఎనిమిదవది:— లోకజ్ఞానపరిపక్వము. ఈ మహానుభావుఁడు కేవల పండితుఁడును గవియు నే గాక లోకజ్ఞాన మెఱింగిన మహామేధావి.

శాస్త్రముల యందును గ్రంథముల యందును జెప్పఁబడినవియే గాక నిత్యమును ప్రపంచమున జరుగుచున్న విషయములను గ్రహించి యందలి మంచిచెడ్డల నెఱిఁగి లోకహితమును గాంక్షించి, తన యనుభవజ్ఞానమును దన గ్రంథములయందు బ్రకటించిన మహాపురుషుఁ డీతఁడు.

ఈ కారణములచే నీతని కవిత్వము పండితపామర జనానురంజకమై సర్వజనహృదయాకర్షణ మొనరించుచున్నది. వీని కుదాహరణములను జూప నెంచినచో నది యొక పెద్దగ్రంథమగును.

ఈతని యాంధ్రీకరణ విధానము :

ఈ మహాకవి భారతాంధ్రీకరణమును యథేచ్ఛగా సాగించినాఁడు కాని మక్కికిమక్కిగా చేయలేదు. ఇతఁడు విరాటోద్యోగ పర్వములలో మూలమందలి కథను మాత్రము గైకొని తనయిష్టము వచ్చినట్లు పెంచియుఁ గుదించియుఁ బాత్రౌచిత్యము కొఱకును రసపోషణము కొఱకును చాలమార్పులనుఁ గావించి యాపర్వములను స్వతంత్ర గ్రంథ మనునట్లుగా రచించినాఁడు. భారతమునందు పాఠకులకును శ్రోతలకును నెక్కువయాహ్లాదమును గలిగించినవి, విరాటోద్యోగ పర్వములు. తిక్కనసోమయాజి తన లోకజ్ఞానమును, పాత్రౌచిత్యమును గనుపరచి, యీ రెండు పర్వములను రచించియుండెను. ఈతని యాంధ్రీకరణ విధానమునుఁ జూపుటకై యీపర్వములనుండియే దృష్టాంతమును గైకొనుట సమంజసమని యట్లుచేసితిని.

కౌరవసభకు శ్రీకృష్ణుఁడు రాయబారము పోవనున్నప్పుడు ద్రౌపది శ్రీకృష్ణునితో నుడివిన వాక్యములను, సంస్కృతభారతము నుండియు, తిక్కనభారతమునుండియు నెత్తి యీక్రింద వ్రాయుచున్నాఁడను.

"సుతా ద్రుపదరాజస్య అసితాయతమూర్ధజా
సంపూజ్య సహదేవంచ సాత్యకించ మహారథమ్"
"భీమసేనంచ సంశాంతం దృష్ట్వా పరమదుర్మనాః
అశ్రుపూర్ణేక్షణా వాక్యమువాచేదం మనస్వినీ."
"విదితం తే మహాబాహో ధర్మజ్ఞ మధుసూదన
యథా నికృతి మాస్థాయ భ్రంశితాః పాండవా స్సుఖాత్."
ధృతరాష్ట్రస్య పుత్రేణ సామాత్యేన జనార్దన
యథాచ సంజయో రాజా మంత్రం రహసి శ్రావితః"
"యుధిష్ఠిరేణ దాశార్హ తచ్చాపి విదితం తవ
యథోక్తః సంజయ శ్చైవ తచ్చ సర్వం శ్రుతం త్వయా."
"పంచనస్తాత దీయంతాం గ్రామా ఇతి మహాద్యుతే
అవిస్థలం వృకస్థలం మాకందీం వారణావతమ్."
"అవసానం మహాబాహో కశ్చిదేకంచ పంచమమ్
ఇతి దుర్యోధనో వాచ్య స్సుహృదశ్చాస్య కేశవ"
"నచాపి హ్యకరో ద్వాక్యం శ్రుత్వా కృష్ణ సుయోధనః
యుధిష్ఠిరస్య దాశార్హ శ్రీమత స్సంధి మిచ్ఛతః"
"అప్రదానేన రాజస్య యది కృష్ణ సుయోధనః,
సంధి మిచ్ఛే న్నకర్తవ్య స్తత్ర గత్వా కథంచన."
"శక్ష్యంతి హి మహాబాహో పాండవా స్సృంజయై స్సహ
ధార్తరాష్ట్రబలం ఘోరం క్రుద్ధం ప్రతిసమాసితుమ్."
"నహి సామ్నా నదానేన శక్యోర్థ స్తేషు కశ్చన,
తస్మాత్తేషు నకర్తవ్యా కృపా తే మధుసూదన."
"సామ్నా దానేనవా కృష్ణ యేన శామ్యంతి శత్రవః
మోక్తవ్య స్తేషు దండ స్స్యాత్ జీవితం పరిరక్షతా."
"తస్మాత్తేషు మహాదండః క్షేప్తవ్యః క్షిప్ర మచ్యుత,
త్వయా చైవ మహాబాహో పాండవై స్సహసృంజయైః"

"ఏతత్సమం ధర్మం పార్థానాం తవచైవ యశస్కరమ్
క్రియమాణం భవేత్ కృష్ణ క్షత్రస్యచ సుఖావహమ్"
క్షత్రియేణహి హంతవ్యః క్షత్రియో లోభమాస్థితః
అక్షత్రియోవా దాశార్హ స్వధర్మమనుతిష్ఠతా"
"అన్యత్ర బ్రాహ్మణాత్తాత సర్వపాపేష్వవస్థితాత్,
గురుర్హి సర్వవర్ణానాం బ్రాహ్మణః ప్రసృతాగ్రభుక్"
"యథా వధ్యే భవేద్దోషో వధ్యమానే జనార్దన,
స వధ్యస్యావధే దృష్ట ఇతి ధర్మవిదో విదుః"
"యథా త్వాం నస్పృశేదేష దోషః కృష్ణ తథా కురు,
పాండవైస్సహదాశార్హ సృంజయైస్సహ సైనికైః"
"పునరుక్తంచ వక్ష్యామి విస్రమ్భేణ జనార్దన,
కానుసీమంతినీ మాదృక్ పృథివ్యామస్తి కేశవ"
'సుతా ద్రుపదరాజస్య వేదిమధ్యాత్సముత్థితా,
ధృష్టద్యుమ్నస్య భగినీ తవ కృష్ణప్రియా సఖీ"
"ఆజమీఢకులంప్రాప్తా స్నుషా పాండోర్మహాత్మనః
మహిషీ పాండుపుత్రాణాం పంచేంద్ర సమవర్చసామ్."
"సుతా మే పంచభిర్వీరైః పంచజాతా మహారథాః,
అభిమన్యుర్యథా కృష్ణ తథా తే తవ ధర్మతః"
"సాహం కేశగ్రహం ప్రాప్తా పరిక్లిష్టా సభాం గతా,
పశ్యతాం పాండుపుత్రాణాం త్వయి జీవతి కేశవ."
"జీవత్సు పాండుపుత్రేషు పాంచాలేష్వథ వృష్ణిషు,
దాసీభూతాస్మి పాపానాం సభామధ్యే వ్యవస్థితా."
"నిరమర్షేష్వచేష్టేషు ప్రేక్షమాణేషుపాండుషు
పాహి మామితి గోవింద మనసా చింతితోఽసిమే."

"యత్రమాం భగవాన్ బ్రహ్మా, శ్వశురో వాక్య మబ్రవీత్,
వరం వృణీష్వ పాంచాలి వరార్హాసి మతాసిమే."
"అదాసాః పాండవా స్సంతు సరథా స్సాయుధా ఇతి
తయోక్తే యత్ర నిర్ముక్తా వనవాసాయ కేశవ."
"ఏవంవిధానాం దుఃఖానా మభిజ్ఞోఽసి జనార్దన
త్రాయస్వ పుండరీకాక్ష సభర్తృజ్ఞాతి బాంధవామ్."
"నన్వహం కృష్ణ భీష్మస్య ధృతరాష్ట్రస్య చోభయోః
స్నుషా భవామి ధర్మేణ సాహం దాసీకృతా బలాత్."
"ధిక్పార్థస్య ధనుష్మత్తాం భీమసేనస్య ధిగ్బలమ్
యత్ర దుర్యోధనః కృష్ణ ముహూర్త మపి జీవతి."
"యది తేఽహ మనుగ్రాహ్యా యది తేఽస్తి కృపామయి,
ధార్తరాష్ట్రేషు వైకోపః సర్వః కృష్ణ విధీయతామ్."
వైశంపాయనః,
"ఇత్యుక్త్వా మృదుసంహారం వృజినాగ్రం సుదర్శనమ్
సునీల మసితాపాంగీ సర్వగంధాధివాసితమ్."
"సర్వలక్షణసంపన్నం మహాభుజగవర్చసమ్
కేశపక్షం వరారోహా గృహ్యవామేన పాణినా."
"పద్మాక్షీ పుండరీకాక్ష ముపేత్య గజగామినీ,
అశ్రుపూర్ణేక్షణాదీనా కృష్ణం వచన మబ్రవీత్."
"అయం తే పుండరీకాక్ష దుశ్శాసనకరోద్ధృతః
స్మర్తవ్య స్సర్వకార్యేషు పరేషాం సంధి మిచ్ఛతామ్."
"యది భీమార్జునౌ కృష్ణ కృపణౌ సంధికాముకౌ.
పితామే యోత్స్యతే వృద్ధః సహపుత్రై ర్మహారథైః."
"పంచచైవ మహావీర్యాః పుత్రామే మధుసూదన,
అభిమన్యుం పురస్కృత్య యోత్స్యంతే కురుభి స్సహ."

శా. పెంపేదం బపకీర్తితక్కువలు రూపింపంగ నేలా? విచా
రింపన్ వారికి మేలు సంధి యిరువారిం జూచినం దారు సా
ధింపంజాలరొ? కాక పోరఁ దగ మర్దింపం దలఁపేని శం
కింపం బట్టోకా? వారు బ్రాహ్మణులె? యేకీడైన సైరింపఁగన్.

ఉ. ఓట మొకింతయేనియు సుయోధను చిత్తమునందు లేదు నీ
మాటలఁ బోవునే దురభిమానము యొక్కుడుపూనుగాక, యా
చోటన సంగరంబు లగుచొప్పులు ఘటిల్లినయేనిఁ బాండవుల్
పోటున కిచ్చగింతురొకొ? పోదురొ? కానఁ దనుండ నచ్యుతా!

ఉ. ఏటుఁగంటి నావలన దింకను నీవును రాజు దమ్ములుం
గానుచితంబు సూచి మనకార్యము, మీసుజనత్వముం జెడం
గా నొకభంగిసేయక తగం గురువర్గముతోడి సంధి మీ
కైన తెఱంగునన్ వలచినట్టుల చేయుఁడు నేర్పు లేర్పడన్

ఉ. ఆఱడిబోకయున్, ఘనమునందుటయున్, గని పెక్కనేరమిన్
మాఱట నోరిదానవయి మాటలు చిత్తమునందు నిల్పకే
గాఱులు ప్రేలెదన్ వినుఁడు, కజ్జము నెగ్గగు గాన నల్కమై
కీఱికి సైనమానిసికి వెండి వివేకము గల్ల నేర్చునే.

చ. వరమునఁ బుట్టితిన్, భరతవంశముఁ జొచ్చితి, నందుఁ బాండుభూ
వరునకుఁ గోడలైతి, జనవంద్యులఁ బొందితి, నీతివిక్రమ
స్థిరు లగుపుత్రులం బడసితిన్, సహజన్ముల ప్రాపుఁగాంచితిన్
సరసిజనాభ! యిన్నిటఁ బ్రశస్తికి నెక్కినదాన నెంతయున్.

వ. అట్లుంగాక,

ఉ. నీవు సుభద్రకుంబలె గడునెయ్యము గారవముం దలిర్ప సం
భావనసేయు; దిట్టినఁ బంకజనాభ, యొకండు రాజసూ
యావభృథంబునందు శుచియై పెనుపొందినవేణి పట్టి యీ
యేవురుఁ జూడఁగా సభకు నీడ్చె! కులాంగన సిట్లొనర్తురే?

ఉ. ఆసభ కేశవ స్త్రీ యగుచుట్టి వసం గొనివచ్చి నొంచు దు
శ్శాసను జూచుచుం బతు లసంభ్రములై తగుచేష్ట లేక నా
యాసలు మాని చిత్రితుల యాకృతినున్నయెడన్, ముకుంద! వి
శ్వాసముతోడ నిన్ గొలువవచ్చు మనం బదియుం దలంపవే?

చ. అరయ మిఁ జేసి కోడలన కష్టుఁడు దాసిగఁ జేసె నన్నహో
పురుషుని పాలికిం బతులు పోవఁగ వీరలతోన యేను జె
చ్చెరఁ జని కోలగంబు దగఁ జేయుదునో? అటుగాక పాడికై
వరపుడ మోపి చేయుదునొ వారికి? మాధవ సెప్పుయుంవుమా!

వ. అని యట్లుగ్గశించి,

ఉ. ద్రోవది బంధురం బయిన క్రొమ్ముడిఁ గ్రమ్మనవిచ్చి వెంట్రుకల్
దావలచేతఁ బూని యసితచ్ఛవిఁ బొల్చు మహాభుజంగమో
నాఁ కలసిల్లి వేలఁగ మనంబునఁ బొంగు విషాదరోషముల్
గావఁగలేక బాష్పములు గ్రమ్మఁగ డగ్గఱలేచి యార్తయై,

క. ఇవి దుస్ససేను వ్రేళ్ళం
దవిలి సగము ద్రెవ్వపోయి దక్కినయవి కా
రవుఁ గడ దీఱుమాటల
యవసరమునఁ దలఁపవలయు నచ్యుత! వీనిన్.

సీ. ఈ వెంట్రుకలు పట్టియీడ్చిన యాచేయి
దోలుతగా బోరి గో దుస్ససేను
తను వింతలింతలు తనియలై చెదరి రూ
పఱియున్నఁ గని యుడుకాఱుగాక
యలుపాలఁ బొనుపడునట్టి ఛిచ్చే యిది?
పెనుగదఁ బట్టిన భీమసేను
బాహుబలంబును బొలించి గాండీవ
మనునొక విల్లాప్పడును వహించు

ఆ. కత్తివికర్మంబుఁ గాల్పనే? యిట్లు
బన్నములు పడిన ధర్మనందనుండు
నేను రాజరాజపీనుంగుఁ గన్నారఁ
గానఁబడయ మైతిమేలిఁ గృష్ణ?

ఉ. నెట్టన యిట్టియల్క మదినిల్పితి రక్కసతాల్మిఁ జూపెడిం
గట్టిరనాట్లు పెద్దనయును గాలము దీనికి వాఱు లెన్నడుఁ
బుట్టదు దుష్టనిగ్రహము పూని జగంబులు గాఁచు నటితోఁ
బుట్టవె నీవు, తేజమునఁ బొల్చిన భర్తలు గల్గ నచ్యుతా!

వ. అనుచు నెలుఁగు రాలువడ నేడ్చిన యాజ్ఞసేనిం గృపాయత్తచిత్తుం డయి నారాయణుం డూరార్చి కూర్చుండ నియమించి కన్నీరు దుడువను, బెన్నెఱివేణి ముడువనుం దగువారి నియోగించి యిమ్మానినితో నిట్లనియె."

పై శ్లోకములను బద్యములను జదివి చూచినచో సంస్కృత భారతమునకుఁ దిక్కనసోమయాజి రచనము వన్నెపెట్టినదని తోఁపక మానదు. ఈ సందర్భమున శ్రీ కొ. లక్ష్మణరావు పంతులుగారు వ్రాసిన వాక్యముల నుదాహరించెదను. "తిక్కనకృతభారతము సంస్కృతమహాభారతమునకు భాషాంతరీకరణ మని మనవారంద ఱనుకొనుచున్నారు; కాని యది గొప్ప పొరపాటు. ఇట్లనుకొనుట మనము తిక్కనయెడ నొకయపరాధము సేయుటయే. సంస్కృతభారతము బంగారపుముద్ద. ఆంధ్రభారతమా ముద్దలోనుండి కావలసినంత బంగారమును దీసికొని స్వర్ణకారుని బుద్ధివైభవముతోఁ జేయఁబడిన చక్కనిసువర్ణకమలము వంటిది. ఉభయభారతములలోని యీ భేదముఁ జూపి స్వర్ణకారుని బుద్ధివైభవము వెల్లడిచేయుటయే నాయుద్దేశము" విరాటోద్యోగ పర్వములందక్క తక్కినభాగమును దిక్కన క్లుప్తము చేసినాఁడు.

పూర్వకాలమున విశేష రాజకార్యములలో నవసరము వచ్చి నప్పుడు మహారాణులు కూడ సభలోనుండి చర్చలలోఁ బాల్గొనుచుండెడివారని యీకథవలన మనకుఁ దెలియుచున్నది. ఇట్టిసంప్రదాయము పురాణయుగములోనే కాదు. చారిత్రకయుగమునఁ గూడఁ గలదు. పదునొకండవ శతాబ్దిప్రాంతమున మనదేశముపైకి దండెత్తి వచ్చిన మహమ్మదీయులకు సాహాయ్య మొనర్చుచున్న జయచంద్ర మహారాజుపై యుద్ధము చేయఁబోవుచు నాతని యల్లుఁడగు పృథ్వీరాజు చిత్తూరురాణాయైన సమరసింహుఁడు మొదలగు మహారాజులతో నాలోచించుటకై యొకసభను సమకూర్చెననియు, పృథ్వీరాజు నాజ్ఞానుసారముగ నాతని రాణియు జయచంద్రుని తనయయు నగు సంయుక్తాదేవి యాసభకువచ్చి సమరతంత్రములలోఁ బాల్గొని దేశమాత సంరక్షణమునకై జయచంద్రునితోఁ బోరుసల్పుట యుచితమే యనియు నందుఁ దండ్రి ప్రాణములు పోయినను దానందులకుఁ జంకింపననియుఁ దెల్పి భర్తప్రయత్నమునకుఁ దోడుపడియెననియు, నప్పుడాసభయందున్న చాందూభట్టు అనుమహాకవి 'పృథ్వీరాజరాసా' యనుగ్రంథమున వ్రాసి యున్నాఁడు

తిక్కనమహాకవి రచించిన కావ్యములు :

తిక్కనసోమయాజి సంస్కృతాంధ్రములయందుఁ బెక్కు గ్రంథములను రచించినట్లు చెప్పుదురు. కాని రెండుగ్రంథములు మాత్రమే మనకిప్పుడు లభ్యము లగుచున్నవి. అందు మొదటిది నిర్వచనోత్తర రామాయణము. రెండవది శ్రీమహాభారతము.

నిర్వచనోత్తర రామాయణము

ఇది వాల్మీకిరామాయణములో సప్తమకాండమున కాంధ్రీకరణము. రావణవధానంతరము శ్రీరామచంద్రుఁ డయోధ్యయందు పట్టాభిషిక్తుఁడగుపిమ్మటను జరిగినకథకుఁ బూర్వరామాయణమని పేరు. ఇది

యేడుకాండలుకలది. ఈయేడుకాండములలోను జెప్పని రావణ జననాది పూర్వవృత్తాంతమును శ్రీరామపట్టాభిషేకానంతర సీతావనవాస కథయు కుశలవ జననాది కథలును నేడవకాండమున నున్నవి. దీని కుత్తరరామాయణమని పేరు. దీని నీ యుభయకవి మిత్రుఁడు తెనిఁగించెను గ్రంథమునందెచ్చటను వచనము లేకుండ రచియించుటంజేసి దీనికి నిర్వచనోత్తరరామాయణమని పేరువచ్చినది. కవులు సాధారణముగాఁ గథాసందర్భమును గలుపు పట్టులయందును, వర్ణనలనుఁ జేయుపట్టులను వచనములను రచియించుచుందురు. అట్టిచో లేకుండ నాభాగములను గూడఁ బద్యములచేఁ బూరించిన సొంపుగ నుండునని తన యభిప్రాయమును దిక్కన యీక్రింది పద్యములలో వ్యక్తీకరించినాఁడు.

క. వచనము లేకయ వర్ణన
రచియింపఁగఁ గొంతవచ్చుఁ బ్రౌఢులకుఁ గథా
ప్రచయముఁ బద్యములన పొం
దుచితంబుగఁ జెప్పు టార్యు లొప్పిద మనరే?

క. లలితపదహృద్యపద్యప్రసం
బులన కథార్థంబు ఘటితపూర్వాపరమై
యలఁతి యలఁతి తునియలఁగా
హాల సంధించిన విధంబు నమరఁగవలయున్.

ఇతఁడు పూర్వరామాయణమును విడచి యుత్తరరామాయణమును దెలిఁగించుటకు గారణ మంతకుఁ బూర్వమే పూర్వరామాయణమును భాస్కరుఁ డాంధ్రీకరించియుండుటయే యనియు భాస్కరరామాయణమును రచించిన దీతని పితామహుఁడైన భాస్కరుఁడే యనియుఁ గొందఱనుచున్నారు. ఈసందర్భమునఁ దిక్కన రచించిన రెండుపద్యముల నుదాహరించుచు వానిఁ గూర్చియు, భాస్కరరామాయణ కర్తృత్వమును గూర్చియు మంత్రిభాస్కరుని చారిత్రమున విపులముగాఁ

చర్చించియున్నాఁడను. ఆవిషయములను మరల నిటవ్రాయుట పునరుక్తియని విడచితిని. తిక్కనసోమయాజి భారతాంధ్రీకరణమువలెనే నిర్వచనోత్తర రామాయణమును మక్కికిమక్కిగాఁ జేయక స్వేచ్ఛ గైకొని రచించియున్నాఁడు. నిర్వచనోత్తర రామాయణమును పది యాశ్వాసములుగా రచియించి తనప్రభువగు మనుమసిద్ధి మహారాజున కంకితము చేసెను. ఇందు నన్నయవలెనే యితఁడును తన గ్రంథము మొదల నాంధ్రపద్యమును వ్రాయక యీక్రింది సంస్కృత శ్లోకమును రచియించెను.

శ్లో॥ శ్రీరాస్తాం మనుమక్షితీశ్వరభుజాస్తమ్భే జగన్మణ్డల
ప్రాసాదస్థితి భారభాజి దధతీ సాలభఞ్జీశ్రియం
శస్త్రాణాం త్రైమగణ్డభిత్తిషు మదవ్యాసఙ్గవశ్యాత్మనాం
యా ముత్తేజయతేతరాం మధులిహా మానన్దసాన్ద్రస్థితిః॥

## శ్రీ మహాభారతము

వ్యాసవిరచితమైనసంస్కృతభారతమునందలిపదునెనిమిదిపర్వముల లోను నన్నయభట్టు ఆదిపర్వమును, సభాపర్వమును, అరణ్యపర్వమునఁ గొంతభాగము నాంధ్రీకరించెను.

తిక్కనసోమయాజి యరణ్యపర్వమునందలి తక్కిన భాగము నాంధ్రీకరింప వలసియుండఁగా దానిని విడచి విరాటపర్వాదిగాఁ బదు నైదుపర్వముల నాంధ్రీకరించెను. తిక్కనరచించిన :

ఉ. ఆదరణీయసారవివిధార్థగతిస్ఫురణం బు గల్గి య
ష్టాదశపర్వనిర్వహణసంభృతిమై నెనుపొందియుండ నం
దాదిఁ దొడంగి మూఁడుకృతు లాంధ్రకవిత్వ విశారదుండు వి
ద్యాదయితుండొనర్చె మహితాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్"

మ. హృదయాహ్లాదిచతుర్థమూర్తికథోపేతంబు నానారసా
భ్యుదయోల్లాసి విరాటపర్వమట యుద్యోగాదులుం గూడఁగా

బదు నేనింటిఁ దెనుంగుబాస జనసంప్రార్థ్యంబులై పెంపునం
దుదిముట్టం రచియించు టొప్పు బుధసంతోషంబు నిండారఁగన్.

అను పద్యములనుబట్టి యారణ్యపర్వము నన్నయభట్టు పూర్తిగనే రచించినట్లు కన్పట్టుచున్నది కాని సాక్ష్యమిందుకు వ్యతిరేకముగా నున్నది. ఈవిషయమునుగూర్చి యెఱ్ఱాప్రగడచరిత్రమునఁ జర్చింపఁ దలంచి యిట వదలివైచితిని.

ఆంధ్రిలో కావ్యోదయమును గాంక్షించి, ఈమహాభారతనిర్మాణకార్యమునకుఁ దాను సంసిద్ధుఁడనైతినని యీకవిసార్వభౌముఁ డీక్రింది పద్యములోఁ జెప్పియున్నాఁడు.

"ఉ. పావన భారతామృతము కర్ణపుటంబుల నారఁ గ్రోలి యాం
ధ్రావలి మోదమందఁ బొరయునట్లుగ సాత్యవతేయ సంస్కృతి
శ్రీవిభవాస్పదంబయిన చిత్తముతోడ మహాకవిత్వ దీ
క్షాపధి నొంది పద్యముల గద్యములన్ రచియించెదం గృతుల్

పరిశాంతహృదయముతో భారతరచనమునకు దీక్షఁ గైకొనిన యీ పుణ్యపురుషుఁడు తెలుఁగుభాషలో భారతమును రచియించుట "పురుషార్థతరుపక్వఫల"మని హరిహరనాథుఁడే రచియించిన ట్లీకవి యీక్రిందిపద్యములలోఁ దెలిపినాఁడు.

క. పారాశర్యనిఃసృతి యయి
భారతమను పేరఁ బరగు పంచమవేదం
బారాధ్యము జనులకు ద
ద్గౌరవ మూహించి నీ వఖండితభక్తిన్

తే. తెనుఁగుబాస వినిర్మింపఁ దివురు టరయ
భవ్యపురుషార్థతరుపక్వఫలము గాదె
దీని కేనియ్యకొని వేడ్క నూని కృతిప
తిత్వ మర్థించి వచ్చితిఁ దిక్కనశర్మ!

ఆంధ్రభాషలో ప్రాశస్త్యము లగు కావ్యములను రచించినవారిలో దిక్కనసోమయాజిని మొదటివానినిగా నెన్నవచ్చును. ఇంతేకాదు, పరిమాణము నందుఁగూడ నీతనితో సమానముగ గ్రంథరచనము గావించిన యాంధ్రకవు లింకొకరు లేరు. నిర్వచనోత్తర రామాయణమున దాదాపు ౧౩౦౦ పద్యములును, మహాభారతమునఁ బదునాలుగు వేల గద్యపద్యములును గలవు. ఈతని రచనములయం దేభాగమును దీసి చదివినను విసువు జనింపక యింకను జదువవలయు ననియే యుత్సాహము కలుగుచుండును.

## తిక్కన పద్యరచనము

కందపద్యరచనమునం దీతఁడు కడునేర్పరి. మన దేశమున "పందినిఁ బొడిచినవాఁడు బంటు, కందము జెప్పినవాఁడు కవి" యను నొక నానుడికలదు. కందపద్యములను రచించుట కష్టతరమని దీని యభిప్రాయము. కవిచౌడప్ప చెప్పిన:

"క. ముందుఁగ జను దినములలో
కందమునకు సోమయాజి ఘనుఁడందురు నేఁ
డందఱు నను ఘనుఁడందురు
కందమునకుఁ గుందవరపు కవిచౌడప్పా"

అను పద్యమునుబట్టి పూర్వకాలములోఁ దిక్కనసోమయాజి కందములు మతికెక్కినవని తెలియుచున్నది. ఇతఁడు కందపద్యములను సరసముగా రచియించుటే కాక సంఖ్యయందుగూడ వాని నధికముగా వ్రాసియున్నాఁడు. దాదాపు ౧౩౦౦ పద్యములుగల నిర్వచనోత్తర రామాయణములో నైదువందల యిరువదియాఱు గందములున్నవి. భారతమునందలి మొత్తము గద్యపద్యములు పదునాలుగు వేలలోను మూఁడవభాగ మయిదువేల మూఁడువందలు కందపద్యములు. భాస్కరరామాయణము

న మల్లికార్జునభట్టు రచించిన భాగములోఁ గూడ నూటికి నలువదికి మించి కందపద్యములు కలవు. మల్లికార్జునభట్టు పేరఁగల భాగములోఁ జాలభాగము మంత్రిభాస్కరుఁడు రచించెనని యొకవాదము కలదు. ఆ వాదము సత్యమయ్యెనేని, తాతయు మనుమఁడును, శూరులును మంత్రులు, నగుటయందే కాక, కందపద్యరచనమునఁ గూడ నొకరి కొకరు దీసిపోక వంశమర్యాదను గాపాడిరని విదితమగును. విరాట పర్వాదియందుఁ దక్కఁ దక్కిన ప్రతియాశ్వాసాదియందును దిక్కన కంద పద్యములనే వ్రాసియుండెను.

తిక్కనసోమయాజి సామాన్యముగా, శార్దూల మత్తేభాదిపద్యములనే గాని, కవిరాజవిరాజితాది వృత్తములను రచియించుటలో నేర్పరి కాఁడని యెవ్వరో యాక్షేపింపగా స్త్రీపర్వమునఁ గష్టపడి యాతఁడు విశేషముగా వృత్తములను రచియించెనని కొందఱనుచున్నారు. స్త్రీపర్వమున నట్టివృత్తములు విశేషముగా నున్నమాట సత్యమే కాని, యెవరో యాక్షేపించిన మీఁదట వానిని రచించెననుట సత్యముండదు. స్త్రీపర్వమందలి కథ దుఃఖకరమైనది అందు స్త్రీపాత్రము లెక్కువగా పాల్గొని శోకపూరితములగు వాక్యములను బల్కుచుండుటగాననగును ఆకథ కనుకూలముగ నుండునని యావృత్తముల నాతఁడు రచియించి యుండును. చంపకోత్పలములు గాని, మత్తేభశార్దూలములు గాని, స్త్రీ పర్వమున లేవు. దాదాపు నలువదివిధములగు నితరవృత్తము లిందుఁ గలవు.

ఈతఁడు రచియించిన రెండు కావ్యములలోను, నిర్వచనోత్తర రామాయణకవిత్వముకంటె మహాభారతకవిత్వము రసవత్తరమై యారి తేరి హృదయంగమముగా నున్నది. నిర్వచనోత్తరరామాయణమునఁ గొన్నితావులలో నీతనికవిత్వము నారికేళపాకములో నున్నదని కొందఱందురు. కాని యది సత్యము కాదు.

ఈతని కవిత్వశైలి చూపుటకిదివఱ కుదాహరింపఁబడిన పద్యములే చాలియున్నవి. ఈతని పద్యములన్నియు, రసవంతములై యుండును. అట్టివానిలో మంచివివి యని యేర్పఱచుట యసంభవము. అయినను, రామాయణమునుండి యాశ్వాసమున కొకటివంతున పదిపద్యములను, భారతమునుండి పర్వమున కొకటిచొప్పున పదునెనిమిపద్యముల నీదిగువ నుదాహరించుచున్నాఁడను. మచ్చుచూపుటలో మంచి చెడ్డలు రెండిటినిగూడఁ జూపుట ధర్మముకదా!

నిర్వచనోత్తర రామాయణము:

చ. జనకునియజ్ఞవేదికఁ బ్రశస్తముగా జనియించి యంగనా
జనతకు భూషణం బనఁగ జాలిన సీతకు రుద్రచాపభం
జనమునునంతు విచ్చి నృపసత్తముఁ డాతిఁ బరిగ్రహించి పే
ర్చిన యుభయానురాగము పఁజిత్రభవుం జరితార్థుఁ జేయుచున్. ఆ౧

చ. వరములు గాంచి బాహుబలవంతుఁ డనం దగుమాల్యవంతుఁడ
చ్చెరువగు విక్రమంబునఁ బ్రసిద్ధివహించి నిజానుజన్మలం
గర మనురక్తి మన్ననఁ దగం గొనియాడుచు సర్వలోకభీ
కరుఁడయి దేవతామునినికాయము దల్లడమందుచుండఁగన్. ఆ౨

చ. తనయుఁడు తండ్రియగ్రజుఁడు తమ్ముఁడనం జనునయ్య రాజ్యముల్
గొను నెడ శౌర్యలంపటులకున్ మఱి చుట్టఱికంబు గల్గునే
యను వగునంతకున్ రిపుఁ డుదగ్రత సైఁచిన నింక నూరకుం
డ నగునె వేగపోరికిఁ గడంగుము నీభుజదర్ప మేర్పడన్. ఆ౩

శా. కేలీకందుక వల్ల నెత్తుకొనుమాడ్కిం బట్టి నాయున్న యా
కైలాసాచలమిల్లు నీవు నెయ్యంగా నెత్తితం జోద్యమై
సీలా వేఁగొనియాడు జెల్లరును వర్ణింపంగ వీకొక్క పే
రేలోకంబునఁ జెల్ల దైత్యులకుఁ బెంపెక్కంగ నేనిచ్చెదన్. ఆ౪

చ. పరమపతివ్రతావిభవ భాసురలీల వెలుంగుచున్న ని
ష్కరుణత నిమ్మహిం బతిచేఁ గావున నీవనుబాధనుండు స
త్పురుషపరిగ్రహం బయినపుణ్యసతిం గలుపింపఁజేసి త
ద్వరుని పరాక్రమంబున నవశ్యముస్ఫూర్తిఁ బొందుగాఁ గావుతన్. ౪౫

ఉ. పంచినకెంపుఁ బాసిదివిఁ బ్రాకి దిశల్ వెలిఁగించి చంద్రకాం
తంబుల నీరు సేసి కుముదంబులఁ బిందువు సేరఁ బంచి యు
ష్ణాంబుల నిద్రవుచ్చి మరుసాయకముల్ గరసాఁ బట్టి కో
కంబుల నేఁచి లోకము హొగడ్తలు సేకొని చంద్రుఁడున్నెడన్. ౪౬

శా. వాలిం గీటియు వాయుపుత్త్రు సరియై వాఁ డాత్మశక్తిజ్ఞుడై
యీలోకంబులు గెల్తునే నసిన మా కొందు గలండే మహీ
పాలా గేసర వానివర్తనముఁ జెప్పం జిట్ట లాభిక్రమ
శ్రీలన్ లున్ భవదీయసన్నిధిఁ బ్రశంసింపం గుం జెప్పెదన్. ౪౭

ఉ. రావణునింట నుండఁగ ధరాసుత నే మరలంగఁ దెచ్చి సం
భావన సేఁత కష్టమనిపల్కిరి చూచితె లక్ష్మణా? మహా
దేవుఁడు బ్రహ్మయున్ మునులు దేవగణంబులు మెచ్చ నయ్యెడం
బావకుఁ డిచ్చె నాకు సతిఁ బాపవుమాటలు పుట్టె నయ్యెడన్. ౪౮

మ. ఒకనారీతిలకంబు గానములో నుద్దామశోకార్తయై
వికలాలోకన మశ్రుధారలును బృథ్వీరేణులిప్తాంగముం
బ్రకటాక్రందనమున్ శిథిలకబరీభారంబు వక్త్రాబ్జశో
షకనిశ్వాసగమోహమ్మెయుం గలయవస్థం బొందఁగా నయ్యెడన్. ౪౯

చ. జయజయశబ్దముల్ సెలఁగ సర్వజనంబు నెలర్ప నర్మిలిం
బిలయసుత యుగ్మముం దిగిచి పెద్దయుఁ బ్రొద్దాకఁ గౌఁగిలించి మో
దయుతమనస్కుఁడై నృపతి దమ్ముల నమ్మన మొందఁజేసి య
వ్వయుపరివృద్ధి తల్లుల మనం బలరం బ్రకటించి వేడుకన్. ౫౦

చ. దురమునఁ బెంపుఁ జేసయును దర్పములీల వెలుంగుచుండ సు
స్థిరత శమాంగపంచక విశిష్టగుణంబునఁ బోలి సద్గతిన్
బొరసెదు నీకునై వగవు పుట్టదు బంధులు రాజు దేవులున్
దిరియుదు రింక వారి దగుదీవెత కోర్వక యున్మలించెదన్. సౌప.

మంగళమహాశ్రీ:

ఈతఁడు రణంబునకు నెత్తిచనుచుండి యును
నెంతయును భక్తిఁగని వాకుం
బ్రీతి యొసఁగం బలికి ప్రేమ మొలయం బొగడి
హృద్యయు వినీతిపిరతుండై
చేతులు మొగిడ్చి జయసిద్ధియుఁగ దీవన వి
శిష్టదయ నిమ్మలిన ధర్మం
బేతల ననూనమగు విద్యజయ మగు మాతలకు
నెట్లయిన సిద్ధునుగు నంటిన్. స్త్రీ.ప.

మ. నిజదారైకపరత్వముం గరుణయున్ నిష్కంబునుం దాల్మియున్
సుజనాసంగము దేవపిత్రతిథి సంతర్పణార్చనల్ హంసభు
గ్భజనంబున్ సకలాశ్రమస్థులను శక్త్యాప్రక్రియం బ్రోవుఁ బం
కజగర్భుండు గృహస్థధర్మములుగాఁ గల్పించె నర్థిన్ శ్వరా. శాం.ప.

చ. అనశనవ్రతంబుఁ జేసి సురలాదిమునుల్ మహితానుభావులై
రనఘ సహస్రవర్షములనంతకల్పిత మైన యేకభు
క్తనియమతంత్రమున్ నడపి గాధితనూజుఁడు బ్రాహ్మణత్వమున్
గనియె మహోపవాసములఁ గాని ఫలంబులు లేవు భూవరా. ఉప.

ఉ. ఉత్తర బిడ్డ నెత్తుకొని యొయ్యన మోమలరంగ వచ్చి య
త్యుత్తమతేజుఁడైన పురుషోత్తము నంఘ్రులపొంత భూస్థలిం
జిత్తమెలర్పఁగా దనదు చెన్నగు ఫాలము సేర్చెనన్ ముదా
యుత్తమనస్కుఁడై యతఁడు సాదరభాషల గారవించుచున్. అప.

క. మాయయ్య కానవచ్చెడు
బోయెదు నేనితనితోడఁ బోయెద శుశ్రూ
షాసక్తనై యుండెద
నీయెడఁ గొనుచు మగిడి యేగుము తల్లీ. ఆ.వ.

చ. వలసిన నెట్టి కార్యమును వారిరి నెట్టన గ్రచ్చఁ జేయఁగా
వలఁతి వృతుం బరీక్షితుని వత్సలతం బ్రదికించె శౌరి యి
క్కలమున యాదవుల్ పెనఁగఁగాఁ గని మాన్పఁడు పేక్ష సేసె నీ
పొలుపు టవశ్యభావ్యమని బుద్ధిఁ దలంచుట గాన నయ్యెడున్. మౌ.ప.

చ. తనువు దొలంగ కిట్లు సుకృతంబుల పెంపున వచ్చితిప్పురం
బునకు మహాత్మ! యిచ్చటను బోవదు నీవు దిఁ బాసి మర్త్యతం
బనుపడి యున్న నెయ్యము భావుదులన్ శుభదృష్టి జూడుమా
మనులను సిద్ధులంబగు నెయుండటి చందమునొందియుండఁ గన్నా మ.ప్ర

ఉ. భారతమూర్తితో విధిన భక్తిఁ జతించిన శ్రీయు వాయువున్
భూరియశంబునుం బ్రమదముల్ దృఢచిత్తయుఁ గల్గు వారి శే
కోటక లైన వేగ మిందఁ గూడు సువ్రతుఁ గాంచు సద్గరుల్
గారవ మొప్పఁగాఁ బడయు గర్భిణి యుల్ కురుసంగమూరియునిస్వ.ప

తిక్కన రచించిన యితర కావ్యములు :

(౧) విజయసేనము.

తిక్కనామాత్యుఁడు విజయసేనము ప్రబంధమును రచించె నని యొక ప్రతీతి కలదు. ఈ క్రిందిపద్యములు విజయసేనములోనివని పెదపాటి జగ్గనకవి సమకూర్చిన ప్రబంధరత్నావళిలో నుదాహరించి యున్నాఁడు. ఈ రత్నావళిని శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రులు గారు ప్రకటించియున్నారు. విజయసేనమిప్పు డెచ్చటను గనుపట్టుట లేదు. ఇది యొక ప్రౌఢకావ్యమని చెప్పుచు శ్రీ చిలుకూరి వీరభద్రరావు గా

రాంధ్రులచరిత్రమున నీ క్రిందిపద్యముల నుదాహరించి యున్నారు. ఈ పద్యములు వారికెట్లు లభించినవో తెలియదు.

"సీ. ఘనసారకస్తూరికాగంధముల నవ్వ
గంధబంధంబులు గలపి కలపి,
కుసుమితవల్లికాలంకృతవీథులఁ జొచ్చి
కని సరోగృహముల మునిఁగి మునిఁగి,
సమధికాహార్యాంగసంగీతములలోన
కన్నెతెఁగలకాట కలపి కలపి,
కుముదకుట్మలకుటీకోరకంబులు దూఱి
యావిదంపతులకుఁ దెలిపి దెలిపి,

గీ. యనుదినమ్ము నప్పురాంతికమ్మున గట్టు
వాలు వోలె విప్రవరుఁడు వోలె
నట్టువోలెఁ దాను నచ్చిన చెలి వోలె
మెలయుచుండు మందమారుతంబు.

ఉ. పల్లవపుష్పసంపదలఁ బంచి వసంతుఁడు కాపుగాకనై
యీ ల్లివనంబు సంకటము లేనగఁ దా రొడికంబు మీఱ న
ట్లిల్లన క్రోలి క్రోలి మలయానిలుఁ డందుఁ బురాణపత్త్రముల్
డుల్లఁగఁ జేసె సత్క్రియఁ బటుత్వము కాముఁడు పిచ్చలింపగన్."

విజయసేనము : (ప్రబంధరత్నావళిలోనిది)

ఉ. అల్లనఁ దొంగమొత్తి శిఖ నావలయేటిజలంబు పుచ్చి సం
ఫుల్లతఁ బాదపీఠమున పొంతన యున్న సహస్రనేత్రుపైఁ
జల్లి శివార్చనాకమలసంహతిఁ బ్రోవుగఁ జేయు నల్లు శో
భిల్లు గజాననుండు మదభీప్సితసిద్ధికరుండు గావుతన్.

శా. గీర్వాణావలపాలు పాత్మరచన క్రీడాహతంబైన న
య్యుర్వీశాంఘ్రియు నంత నంత ఘనరత్నోద్యత్ప్రభ లుర్వి దప్ర
కృష్టంబై పాదిగట్టి పేర్చిన మదిం గంబంబ యంచుం గన
గ్గర్వోన్మీలిత నేత్రుఁడై మెఱయు వేదండాననుం గొల్చెదన్.

సీ. పద్మంబులును వప్రపద్మరాగప్రతి
బింబములును తగ బెరసి మెఱయఁ
కల్లోలములును రంగన్మకరాయిత
తుండములును వటు తోట్రుపడఁగ,
బిసములు విహారణరససమాగతరసా
తలనాగశిశువులు చెలిమి సేయఁ
జక్రియుగ్మంబులు జలకేళిలోలని
తంబినీస్తనములు తడఁబడంగ

గీ. సొంపుమీఱి నట్టిపెంపుచు గంభీర
తయును బరపులోవు వేడ్కఁ దగిలి జనులు
సంస్తుతింప నఖిలసన్నివేశస్థితి
నప్పురంబు పరిఖ యతిశయిల్లు.

చ. తరుణుల వీఁగుఁజన్నుఁగవ తాఁకున మన్మథచక్రవాకబం
ధురగతి లీలఁ గాముల తొరవుటూరుల ఘట్టనంబులన్
కరివరహస్తకాండపటుఘట్టనలన్ బరిఖాతరంగముల్
దిరుగుడు వడ్డతీరములఁ దెట్టువుగట్టు సరోజరేణువుల్.

చ. కొనియెద మన్నబండగులు కోటులకమ్మెదు; రమ్మఁబూని తె
చ్చిన సర కెంత పెద్దవెల చెప్పినఁ గొంత్రు తగంగ నిచ్చి; న
చ్చిన వెలతీర్చి లక్ష్మి తమ చెప్పినయట్టుల చేయు సొంపు పే
ర్కొన గణుతింప రాదు; పురికోమటులం బ్రణుతింప నొప్పదే?

క. కిసలయాకరశ్రీబిసబిం
బసుధాంశుప్రాయవస్తు బహువిధరూపో
ల్లసము మద ముడుప నజుఁడొక
యసమాకృతి దాల్చె ననఁగ నంగన యొప్పన్.

సీ. మదనవశీకార మంత్రదేవత దృష్టి
గోచరమూర్తిఁ గైకొనియె నొక్కొ?
సితకరబింబ నిస్సృతసుధాధార సి
తంబినీరూపంబు దాల్చె నొక్కొ?
విధి కామినీశ్రేష్ఠ విజ్ఞానపరసీమ
భ సురతను లీలఁ బడసెనొక్కొ?
శృంగారనవరస శ్రీవిలాసోన్నతి
సుందరాకారంబు నొందెనొక్కొ!

గీ. కాక యొకవధూటికడుపునఁ బుట్టిన
భామ కేల యిట్టి రామణీయ
కంబు గలుగుననుచుఁ గన్నియపై మహీ
పాలసుతుఁడు దృష్టిఁ బఱపెనర్థి.

సీ. అరిమానసమ్ములు దరికొనియెద్దు నె
వ్వని యుజ్జ్వలాకార వైభవంబు?
బంధులలజ్ఞానతిఁ బొందునట్లుగఁ జేయు
నెవ్వని పాండిత్య మెసఁక మెసఁగ?
నెట్టిమాన్యుల నైన నెవ్వాని వితరణం
బులు వదిజముల చాపల మొనర్చు?
వనితాజనము మానధనముఁ గొల్లుచ్చు వి
చ్చలవిడి నెవ్వాని విలసనంబు

గీ. అట్టి విజయసేను నభిరామమూర్తి వి
ద్యానిరూఢమతి వదాన్యవరుఁడు
మధురవిభ్రమైకనిధి యను జగమెల్ల
నతఁడు చిత్రగుణసమగ్రుఁ డగుట.

శా. ఉత్సాహప్రభుమంత్రశక్తుల నజేయుండై పరీక్షించినన్
దత్సామగ్ర్యుఁడు గాక విగ్రహమునో దేశంబుఁ గాలంబు సం
పత్సామగ్ర్యముఁ జూపి శక్యము దెసన్ బ్రారంభియై భూప్రజా
వాత్సల్యార్ద్రమనస్కుఁ డైనతి శక్తిశ్రీసమేతుండగున్.

క. పరధన పరాంగనాజన
పరిహారము ధర్మపథ మందుఁ స
త్పురుషులు మఱవక వీరిం
బరికింపుము విసకు మెపుడు పైశున్యంబున్.

గీ. మహిమ చెడదు స్వామ్యమాత్య సుహృత్కోశ
రాష్ట్రదుర్గబల పరాయణులకు
నీవు నిదియు నెఱిఁగి కావింపు సప్తాంగ
సంగ్రహంబు నీతిశాస్త్రనిపుణ.

ఈక్రింది సీసపద్యము తిక్కన విజయసేనము లోనిదని బ్ర శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు వ్రాసియున్నారు.

సీ. అమ్మోదవనిఁ బద్మాక్షుకౌస్తుభ మైన
వెలవక కొనియాడి వేఁపుగలిగి
విలువ యిచ్చెదమని వేఁడినఁ బాలిజూపఁ
గమ్మపసిండియు నమ్మఁగలిగి
దేవస్తు వెంత ప్రౌద్దండము చనుదెంచి
గొంతటఁడిగన నెదురఁ గలిగి

తమయింట లేనియర్థము లర్థపతియింట
నైన వెదకిన లేవనుట గలిగి

గీ. తమకులాచార వర్తన(?)ము కొఱకు
నంగడుల నొప్పునటుల బేహారుమాట
గాని లాభమునకు గాదనంగ
వఱలుదురు పురవరమున వైశ్యవరులు.

ఈ పద్యమును బ్ర. శ్రీ ప్రభాకరశాస్త్రిగారు తమ ప్రబంధరత్నావళి పీఠికలో నుదాహరించుచు, పై పద్యములలో నొకటి వైశ్యవర్ణన మున్నది ఇదియు వైశ్యవర్ణనమే. రెండు పద్యములును విజయసేనములోనివే యగునా? యని శంకించినారు. పై పద్యములలో గణపతిస్తోత్రమును రెండు పద్యములలో నున్నది. పరిఖావర్ణనమును రెండు పద్యములలోఁ గన్పట్టుచున్నది. జగ్గనకవి సమాహృతులలో నేదైన పొరపాటు జరిగెనో? లేక తిక్కనయే యట్లు రచించెనో, చెప్పఁజాలము. చిమ్మపూడి అమరేశ్వరుఁడను మహాకవి విక్రమసేన మను నొక ప్రబంధమును రచియించియుండెను. అందలి నాయకుఁడు విక్రమసేనుఁడు. నాయిక నిషధసుత. తిక్కన విజయసేనములోని నాయకుఁడు విజయసేనుఁడు. నాయికపేరు లభింపలేదు. ఈ గ్రంథముల నామాక్షరములలో రెండవ మూఁడవ యక్షరములు దక్కఁ దక్కినవి సమానము లగుటచే జగ్గకవి గ్రంథనామముల నిచ్చుటలో పొరపాటు పడియెనేమో!

అప్పకవియును, కస్తూరిరంగకవియును, నీక్రిందిపద్యము విజయసేనములోనిదని సంశయాస్పత యతికి లక్ష్యముగా నిచ్చియున్నారు.

ఉ. వల్లభుఁ డేగు దుర్లభుఁడు వాని దెసం దగు లూఁది యిమ్మెయిన్
దల్లడ మందెదేల యుచితస్థితికిన్ మనుఁ బాఁపినన్

దల్లియు బంధుశోకమును దండ్రియు నే మనవా రెఱింగి రే
నల్లను యిల్లు నీకుఁ దగునో తగదో పరికించి చూడుమా!

కాని యీపద్యమునే చిమ్మపూడి యమరేశ్వరుని విక్రమసేనములోనిదని కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణసారసంగ్రహమున నుదాహరించి యున్నాఁడు. దీనినిబట్టి విజయసేన విక్రమసేనములను జెప్పుటలో తారుమారు జరుగుచున్నదని నిశ్చయింపవచ్చును. అట్లయినచోఁ బైని వ్రాసిన వానిలో నొకే విషయవర్ణనముగల రెండుపద్యములలో నొకటి తిక్కనసోమయాజియు నొకటి యమరేశ్వరుఁడును రచియించి యుందురు. గజాశ్వస్తోత్రపద్యములు రెండింటిలో నుత్పలమాలను దిక్కనయు శార్దూలము నమరేశ్వరుఁడును రచియించి యుందురు. పరిఖావర్ణనమున సీసపద్యమును వైశ్యవర్ణనముగల చంపకమాలయు తిక్కన రచితములని నాయభిప్రాయము. తిక్కన విజయసేనమును రచియించి యుండుట సత్యమేని, యది నిర్వచనోత్తర రామాయణమునకుఁ బూర్వమై యుండును.

(2) కవిసార్వభౌమ ఛందస్సు.

ఈమహాకవి యాంధ్రమున నొక ఛందోగ్రంథమును వ్రాసి యుండెనని చెప్పుదురు. దానిపేరు కవివాగ్బంధన మని కొందఱును కవిసార్వభౌమ ఛందస్సు అని కొందఱును జెప్పుచున్నారు. మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున ౩౬ పంక్తులు గల యొక చిన్న పుస్తక మొకటి యున్నది. గ్రంథాంత పద్యమిది:

క. తనరఁగ కవివాగ్బంధం
బను ఛందం బవని వెలయ హర్షముతోఁ ది
క్కనసోమయాజి చెప్పె
జనులెల్ల నుతింప బుధుల సమ్మతి గాఁగన్.

